65. నీ మనస్సును నాయందు నిలుపుము; నా భక్తుడవుకమ్ము; యజ్ఞములను నా కర్పింపుము; నాకు నమస్కరింపుము; నన్ను తప్పక చేరు దువు. నాకుప్రియుడవు గనుక నీ కిది ప్రమాణపూర్వకముగా చెప్పుచున్నాను.

66. సర్వధర్మములను (అధర్మసహితముగా) విడనాడి, (ఆత్మ రూపమున ఎల్లరులోనుండు) ననొక్కనిసే ఆశ్రయింపుము. నేను నిన్ను అన్ని పాపములనుండి విముక్తుని చేయుదును. శోకింపవలదు.

67. ఈ గీతాశాస్త్రమును తపోరహితులకు, భక్తిహీనులకు, శుశ్రూషింపనివారికి, నాయెడల దురాక్షేపణలుచేయువారికి, ఎన్నడు తెలుపరాదు.

68. నాయందు పరమభక్తికలిగి ఈ అత్యంతగోప్యమగు శాస్త్రమును నాభక్తులకు బోధించువాడు నిస్సంశయముగా నన్నే చేరును.

69. మనుష్యులలో అతనికన్న నాకు ప్రియముచేయువాడు లేడు. అతనికన్న నాకు ప్రియతరు డితరు డెవ్వడును ఈ లోకమున నుండబోడు.

70. మా యీ ధర్మసంవాదము భక్తితోపఠించువాడు నన్ను జ్ఞాన యజ్ఞరూపముగా పూజించినవాడగును. ఇది నా నిశ్చయము.

71. శ్రద్ధావంతుడై, అసూయారహితుడై, దీనిని వినువాడుకూడ ముక్తుడై, పుణ్యకర్ములొనర్చిన వారేగు లోకముల కేగును.

72. నీవు దీనిని ఏకాగ్రచిత్తముతో వింటివా? నీ అజ్ఞానజనిత మూఢత్వము నశించినదా?

అర్జునుడు పలికెను :

73. అచ్యుతా, నీకృపచేత నా మూఢత నశించినది. నా (ఆత్మ తత్త్వము యొక్క) జ్ఞప్తిలభించినది. స్థైర్య మలవడినది. సంశయములు తొలగినవి. నీమాట ననువర్తింతును.

సంజయుడు పలికెను:

74. వాసుదేవునకును మహాత్ముడగు అర్జునకును జరిగిన ఈ అద్భుత సంవాదమును, రోమములు గగుర్పొడుచుచుండ, నే నిట్లు వింటిని.

75. (నాకు దివ్యచక్షువు నిచ్చిన) వ్యాసునికృపచేత, పరమగోప్యమగు ఈ యోగమును యోగేశ్వరుడగు కృష్ణుడు వివరించుచుండగా, ఆయన యొద్దనుండియే, నేను వింటిని.

76. రాజా, కృష్ణార్జునులకు జరిగిన పుణ్యము, అద్భుతము, అగు ఈ సంవాదము ఎన్నిసార్లు నా జ్ఞప్తికి వచ్చునో, అన్నిసార్లు నేను (మరల మరల) హర్షించుచున్నాను.

77. రాజా, శ్రీకృష్ణుని అత్యద్భుతమగు ఆ (విశ్వ) రూపము నా కెన్నిసార్లు జ్ఞప్తికివచ్చునో అన్నిసార్లు నేను మిక్కిలి అబ్బురమందుచు (మరల మరల) హర్షించుచున్నాను.

78. యోగేశ్వరుడగు కృష్ణుడును, ధనువుధరించిన అర్జునుడును ఎచట నుందురో, అచట సంపద, విజయము, అభ్యుదయము, స్థిరమగు రాజనీతియు, ఉండును. ఇది నా అభిప్రాయము.

(శ్రీమద్భగవద్గీతలో - బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును, శ్రీకృష్ణార్జున సంవాదరూపమును అగుదానిలో- "మోక్షసన్యాసయోగము" అను పేరుగల పదునెనిమిదవ అధ్యాయము. )

ఓం శాన్తిః శాన్తిః శాన్తిః
సర్వం శ్రీకృష్ణ పరబ్రహ్మార్పణమస్తు 🌹🙏